## డా॥ మసన చెన్నప్ప గారి రచనలు

1980 - మల్లి పదాలు
(కూనలమ్మ ఛందస్సులో మాటలకట్టె పదాలు)

1985 - వేటూరి ప్రభాకర శాస్త్రి వాఙ్మయ సూచిక
(ఎం.ఫిల్ - సిద్ధాంత వ్యాసం)

1991 - ప్రాచీన కావ్యాలు - గ్రామీణ జీవన చిత్రణ
(పిహెచ్. డి - సిద్ధాంత గ్రంథం)

1991 - నేత్రోదయం
(వచన కవితా సంపుటి)

1995 - సమాలోచనం
(సాహిత్య వ్యాస సంపుటి)

1997 - బృహద్గీత
(బృహదారణ్యకోపనిషత్తుకు తెలుగు సేత -
పద్యాలు మరియు ముత్యాల సరాలలో)

1999 - బ్రహ్మాదర్శం
(వివరణాత్మక వచన గ్రంథం)

1999 - అమృత స్వరాలు
(కవిత్వం)

**ప్రమీలా ప్రచురణలు**

# అమృత స్వరాలు



డా॥ మసన చెన్నప్ప

**AMRUTHA SWARAALU**
(Poetry)
by
**Dr. M. CHENNAPPA,** MA., M.Phil., Ph.D
Associate Professor, Dept. of Telugu, Osmania University
Hyderabad, A.P. - 500 007.



ప్రచురణ సంఖ్య : 8
ప్రథమ ముద్రణ : జులై 1999
ప్రతులు : వెయ్యి
మూల్యం : **రూ. 20/-**

ప్రతులకు :
ప్రమీలా ప్రచురణలు,
12-11-1095/A,
వారాసిగుడా,
సికింద్రాబాద్ - 500 061. ఫోన్ : 7640508

నవోదయ బుక్ హౌజ్,
3-3-865, ఆర్యసమాజం ఎదురు వీధి,
కాచిగుడా, హైదరాబాద్ - 500 027.

స్వస్తిక్ మెటల్ ప్రాడక్ట్స్,
3-3-738, కంచరి బజార్, సికింద్రాబాద్ - 500 003.

Designed & Printed at :
PRINTSHOP, 3-3-736 to740,
Kanchar Bazar, Secunderabad - 3
Ph. : 781 2904

కృతికర్త తో స్వీకర్త



# మున్నుడి

బృహదారణ్యకోపనిషత్తుకు అనువాదమైన 'బృహద్గీత' కావ్యరచన నా సాహిత్య జీవితంలో గొప్ప మలుపు. పన్నెండు వందల ముత్యాల సరాలలో బృహదారణ్యకోపనిషత్తును గానం చేసిన నేను అదే ఛందస్సులో ఈ అమృత స్వరాలను వినిపిస్తున్నాను.

వేదాలు, వేదాంగాలు, ఉపనిషత్తులు, దర్శనాలు మానవ జన్మను పునీతంచేసే ఆధ్యాత్మిక గ్రంథాలు. అవిఇచ్చే సందేశం అందరికీ శిరోధార్యం. కనుకనే అమృత సదృశమైన ఆ సందేశాన్ని మనం లౌకిక భాషల్లోకి అనువదించుకొని, ఐహికాముష్మికాలను అందుకునే ప్రయత్నం చేస్తున్నాం.

కళాప్రపూర్ణ పండిత గోపదేవ్ వల్ల వేదాలతో, ఉపనిషత్తులతో, దర్శనాలతో నాకేర్పడ్డ అనుబంధమే ఈ ముత్యాల సరాలలో నా స్వరాన్ని భద్రపరిచింది. నా పథాన్ని ఎరుక పరచింది.

ఏ మతమైనా, ఏ మార్గమైనా పరమేశ్వరుని సన్నిధికి చేరగలమనే భ్రమలో ఉన్న జనం ఇకనైనా సత్యపథాన్ని త్రొక్కవలసిన అవసరం ఉంది. అందుకు వేదజ్ఞానమే పొందదగిన ముఖ్యసాధనం.

వేదసిద్ధాంత ప్రతిపాదనకనుకూలమైన ఈ అమృత స్వరాలను చదివి నన్ను ప్రోత్సహిస్తూ అభినందనలు తెలిపిన నా గురువర్యులు, జ్ఞాన పీఠ పురస్కార గ్రహీతలు ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి నా కృతజ్ఞతలు సమర్పించుకొంటున్నాను. ఈ అమృత స్వరాలను వేదధర్మగీతావళిగా అభివర్ణిస్తూ తమ అమూల్యమైన అభిప్రాయాన్ని అందించిన రాష్ట్ర హైకోర్టు పూర్వ ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు గారికి నా కృతజ్ఞతలుతెలుపు కొంటున్నాను.

తనది వ్యాపారం, నాది సాహిత్య వ్యాపారం. అయినప్పటికీ లక్ష్యసాధనలో నాతో కలిసి నడుస్తున్న స్నేహశీలి, విక్రమ్ ఆటోమొబైల్స్ (సికింద్రాబాద్) అధినేత శ్రీ పి. రాజనరసింహా రావు గారు ఈ కృతికి స్వీకర్తకావడం నాకెంతో సంతోషంగా ఉంది.

ప్రత్యేక శ్రద్ధతో ఈ కృతికి అక్షరాకృతి కల్గించిన మాన్య మిత్రులు ప్రింట్‌షాప్ అధినేత శ్రీ మాశెట్టి శ్రీనివాస్ గారికి నా కృతజ్ఞతలు అందజేస్తున్నాను.

బృహద్గీతలాగానే ఈ 'అమృతస్వరాలు' ఆంధ్రపాఠక లోకానికి ఆమోదం అవుతాయని ఆశిస్తున్నాను.

మసన చెన్నప్ప

*Jnanpith Awardee*
**Dr. C. Narayana Reddy**
M.A., Ph.d., D.Litt.

CHAIRMAN
**Andhra Pradesh**
**State Cultural Council**
**Government of Andhra Pradesh**
Kalabhavan, Hyderabad- 500 004.
Phone : (O) 214603 (R) 3548451
Fax : (O) 210643



జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి. నారాయణ రెడ్డి**
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్
అధ్యక్షులు
**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
కళాభవన్, హైదరాబాదు - 500 004.
ఫోన్ (ఆ) 214603 (ఇ) 3548451
ఫాక్స్ : (ఆ) 214603

# అభినందన

ఉపనిషత్తులను, దర్శనాలను వ్యగ్రచిత్తంతో అధ్యయనం చేసిన పరమ జిజ్ఞాసువు డా॥ మసన చెన్నప్ప. పండిత గోపదేవుల అంతేవాసిత్వం చెన్నప్ప జిజ్ఞాసకు మరింత నైశిత్యాన్ని సంతరించింది.

డా॥ చెన్నప్ప ఉపనిషత్సూక్తులు కొన్నిటిని ముత్యాల సరాల రూపంలో "అమృత స్వరాలు"గా అందిస్తున్నాడు. ప్రాచ్యగ్రంథ పఠన లబ్ధ సంస్కారంతో కొన్ని సరికొత్త సూక్తులను ఆవిష్కరిస్తున్నాడు. విషయాన్ని రెండు మాటల్లో కుదించి చెప్పడంలో చెన్నప్ప చేయి తిరిగింది. ఉదాహరణకు

" వేద విద్యకు దూరమైతిమి
భేద విద్యకు దగ్గరైతిమి "

మొదటి విద్య చూపేది సమన్వయాన్ని . రెండోవిద్య నేర్పేది వైషమ్యాన్ని. నిత్య జీవితంలో ఉదాహరించదగిన ద్విపదులు ఈ కావ్యం నిండా పరుచుకుని వున్నాయి.

" హితము సేయుట మనుజ ధర్మము
హతము సేయుట దనుజ కృత్యము"

శబ్దం పొందిక అర్థాన్ని గుర్తుంచుకొనేట్టు అమరాలి. పై పంక్తుల్లో ఆ గుణమే ఉంది.

" హింసలను విడువంగ వలయును
హంసలై వెలుగంగ వలయును"

ఇక్కడ హంస పక్షి మాత్రమే కాదు. పరమ వివేకానికి ప్రతీక.

చెప్పదలచుకున్న అంశాన్ని నాలుగు నాలుగు పంక్తుల్లో అనుసంధించి ప్రబోధ శైలిలో ఈ "అమృత స్వరాలు" రచించిన డా॥ మసన చెన్నప్పకు నా హార్దికాభినందన.

**జస్టిస్ ఆవుల సాంబశివరావు**
పూర్వ ప్రధాన న్యాయాధీశులు
ఆంధ్రప్రదేశ్ హైకోర్టు

# వేదధర్మ గీతావళి

డాక్టర్ మసన చెన్నప్ప గారు ఈ స్వరసృష్టి చేశారు, 'అమృత స్వరాలు' అని ఈ స్వరమాలికకు నామకరణం చేశారు. ఈ స్వరమాలికను చదివినప్పుడు నాకు రెండు విశేషాలు గమనంలోకి వచ్చాయి. మొదటిది దయానంద సరస్వతి వేదసాహిత్య మథనం చేసి భారతీయులకు అందించిన వైదిక ధర్మం. రెండవది నవకవితా శకానికి రూపురేఖలు దిద్దుతూ గురజాడ అప్పారావు గారు తెలుగు ప్రజలకు అందించిన ముత్యాలసరాలు.

దయానందుడు ప్రవచించిన విశిష్టవేదసారం చెన్నప్పగారి అమృతస్వరాలకు అంతరాత్మ. చెన్నప్పగారి స్వరాలలోని అమృతం దయానందుని వైదిక శాస్త్ర విశ్లేషణలోనుండి, మథనంలోనుండి ఉద్భవించింది. దయానందుడు నిశిత భావుకుడు. భావ విప్లవవాది. తనకుముందు వచ్చిన వేదభాష్యాలన్నీ పౌరాణిక వాదాన్ని బలపరిచేవిగా, ప్రజల కన్నులను కప్పేవిగా ఉన్నట్లు తెలుసుకున్నాడు. విగ్రహారాధన, అవతారవాదం అబద్ధమని నిగ్గు తేల్చినాడు. పురాణాలచేత భయాన్ని పుంజుకొన్న మూఢాచారాలు, స్త్రీ పురుష వ్యత్యాసాలు, కుల వ్యవస్థ, అంటరానితనం నిరాధారాలనీ, సత్యదూరాలనీ, మానవ సమాజానికి ప్రమాదకరాలనీ నిరూపించాడు. ఆదిశంకరులు బోధించిన మిథ్యావాదాన్ని సంపూర్తిగా త్రోసి పుచ్చాడు. విశ్వంలో బ్రహ్మమొక్కటేకాదు ఆత్మ, పదార్థం అనే మరోరెండు వాస్తవాలున్నాయని ఎత్తిచూపాడు. ఆ విధంగా పదార్థవాదానికి బీజాలు వేసాడు. ఆదిశంకరుల అద్వైతం, మధ్వాచార్యుల ద్వైతానికి భిన్నంగా, వేదానుకూలంగా దయానందుడు త్రైతవాదాన్ని ప్రవేశపెట్టాడు. ఈ రీతిగా ఆ తరవాత పుట్టి పెరిగి శాఖోపశాఖలుగా విస్తరిస్తున్న విజ్ఞాన శాస్త్రానికి వైతాళిక గీతం ఆలపించాడు. ఈ అమృతస్వరాలలో చెన్నప్పగారు దయానందుని సిద్ధాంతాన్ని ఆమోదించి దానికి స్వరరూపం కల్పించారు.

"కనులకగుపడనట్టి అణువుల నన్నిటిని ఒక చోట కూర్చుచు సుందరమ్మగు సృష్టి" చేయబడినదని చెన్నప్పగారు ఒక స్వరంలో పదార్థవాదాన్ని సూచించారు. సూర్యచంద్రులు, పంచభూతాలు దేవుని అదుపాజ్ఞలలో ఉంటాయని మరొక స్వరాన్ని వినిపించారు. మతం, ధర్మం అనే పదాలకు వేరు వేరు అర్థాలున్నాయి. "మతము మతమని వాదులాడిన। మనకు నేమియు చిక్కదండీ ! మతము మానవ కల్పితంబగు । ధర్మమీశ్వర నిర్మితంబగు "నని విశ్వజనీనమైందే ధర్మమని, దాన్ని ఈశ్వరుడు నిర్మించాడని ఇంకో స్వరంలో వివరించారు. " అందరిని ఏకమ్ము చేసెడి । ఆర్షవిద్యలె గొప్ప విద్యలు । ఐకమత్యము కూర్చు విద్యలు । అందరికి కావలయునండీ " అంటూ ఆర్షవిద్యలగొప్పతనాన్ని ఎత్తి చెప్పారు. "ఒకరినొక్కరు పీడనకు గురి చేసికొనుటే హింసయనబడు" నని హింసకు యథార్థ నిర్వచనం ఇచ్చారు. "ఏది చేతనమేది జడమో। తెలియకను పూజించివ్యర్థము" అని విగ్రహారాధనను నిరసించారు. స్త్రీ పురుష భేదం పనికిరాదని చెన్నప్పగారొక స్వరంలో ఎంతో రమ్యంగా చెప్పారు.

**"స్త్రీలవాదము పురుష వాదము**
**ఎందుకో ఈ భేద భావము ?**
**కలిసి పిల్లల కనెడియట్టుల**
**కలిసి బ్రతికిన చాలదొక్కో" అని**

ఈ స్వరాలలో చెన్నప్పగారు ఆర్షధర్మాన్ని గళమెత్తి స్వేచ్ఛాగానం చేసారు. చెన్నప్పగారు వైదిక విజ్ఞానాన్నంతటిని తమ గురుదేవుల నుండి నేర్చుకున్నారు. పండిత గోపదేవులు చెన్నప్పగారి గురుదేవులు కనుకనే " గోపదేవుని కరుణచే నాలోపమేమో తెలియవచ్చెను" అని స్పష్టంగా చెప్పుకున్నారు. దినానికి నాలుగుగంటల చొప్పున ఏడాది కాలం పాటు గురుదేవులైన గోపదేవులు ప్రేమతో దర్శన శాస్త్రాలన్నింటిని తనకువివరించారు. గోపదేవులు తనకు నమ్మదగిన తెలుగు బాటను చూపించారట. చెన్నప్పగారికి గురుదేవుడంటే ఎంత భక్తి! ఎంత కృతజ్ఞత ! అయితే అదినాకు ఆశ్చర్యం కల్గించలేదు. పండిత గోపదేవశాస్త్రిని నేను ఎరుగుదును. సన్నిహితంగా ఎరుగుదును. దార్శనికునిగా, తత్త్వవేత్తగా ఎరుగుదును. ఆయన అసాధారణమైన దార్శనికుడు. పైగా ప్రేమమూర్తి. ఆయన వివరణశక్తి అనన్యసామాన్యము. అటువంటివారిని గురుదేవునిగా స్వీకరించిన చెన్నప్ప గారు తామూ గొప్ప విజ్ఞానవంతులైనారు. తత్ఫలితంగా ఈ స్వరమాలను తెలుగువారికి అందిస్తున్నారు.

చెన్నప్పగారు చేపట్టిన ప్రక్రియ నాకు బాగా నప్పింది. చక్కని తెలుగు. ప్రతిస్వరమూ రాగమయం. లయబద్ధం. ఛందశ్శాస్త్రాన్ని ఎరిగినవారు ఇది మాత్రాఛందస్సు అంటారు. మానసోల్లాసం కలిగించేరీతి ఈ స్వరాలలో ఉట్టిపడుతుంది. అట్టి సుందర స్వరరూపంలో గంభీరమైన భావాలను, క్లిష్టమైన ఆలోచనలను చెన్నప్పగారు చెప్పగలిగారు. పాఠకుల హృదయానికి హత్తుకునేటట్లు చెప్పగలిగారు. అరుదైన, విలువైన రచన ఇది. అందుకు వారిని అభినందిస్తున్నాను.

# అమృత స్వరాలు

క్లేశ కర్మ విపాకములతో
ప్రకృతి జన్య పదార్థములతో
అంటువడక వెలుంగు దేవుని
అమృత పురుషుని భక్తి మ్రొక్కెద

సూర్యుడాదిగ దివ్యలోకము
లెన్నియో సృజియించి తనదగు
గర్భమున వెలుగొంద జేసెడి
దేవదేవుని భక్తి మ్రొక్కెద

కనులకగుపడనట్టి అణువుల
నన్నిటిని ఒక చోట కూర్చుచు
సుందరమ్మగు సృష్టి జేసెడి
పరమ పురుషుని భక్తి మ్రొక్కెద

సృష్టిలోపల ప్రళయముల్ ప్రళ
యమ్ములోపల సృష్టి జేయుచు
సృష్టి లయముల కర్త అయ్యెడి
దివ్యపురుషుని భక్తి మ్రొక్కెద

సూర్యచంద్రులు, పంచభూతము
లెవని ఆజ్ఞలు తలల దాల్తురో
ఎవ్వ డీ జగమేలు వాడో
అట్టి దేవుని భక్తి మ్రొక్కెద

సృష్టి చేసీ, వెంటనే వే
దములు చేసీ మానవాళికి
మంచిదగు మార్గమ్ము చూపెడి
వేదపురుషుని భక్తి మ్రొక్కెద

సృష్టి చేయుచు స్థితిని గూర్చుచు
మరల దానిని లయము చేయుచు
మూడు సమయములందు సమముగ
వెలుగు జ్యోతిని భక్తి మ్రొక్కెద

కంటికెప్పుడు రెప్ప లాగా
ప్రాణి కోటికి రక్షకుండై
కర్మలకు దగు ఫలము లిచ్చెడి
కర్మసాక్షికి భక్తి మ్రొక్కెద

పసిడిలోపల రాగి విధముగ
జగము నీలో దాగి ఉన్నది
రాగి కంటెను పసిడి భిన్నము
జగము కంటెను నీవు భిన్నము

లేదు నీలో దుఃఖమెప్పుడు
అంతయును ఆనందమే మరి !
దుఃఖ పంకమునందు మునిగితి
లేపి నను కాపాడ వయ్యా !

ఎంత అజ్ఞానమ్ము నాలో
దాగి ఉన్నదొ చెప్పజాలను
జ్ఞానమును ప్రసరించవయ్యా !
చీకటిని తొలగించవయ్యా !



సచ్చిదానంద స్వరూపా !
సృష్టికర్తా ! దివ్యమగు నీ
గుణములెంతుము, మంచిగా మా
బుద్ధులను నడిపించు స్వామీ !

రెండు పక్షులు గలవు చెట్టున
మంచి మిత్రములవి అనాదిగ
ఒకటి పండు భుజించుచుండగ
ఒకటి చూచుచు వెలుగు చున్నది

సత్ పదార్థము నెరుగ గల్గిన
శాశ్వతంబగు సుఖము దొరకును
ప్రకృతి పురుషులకంటె బ్రహ్మమె
ఉత్తమోత్తమ సత్పదార్థము

పసిడిలోపల రాగి కలిసిన
పసిడిగానే గోచరించును
బ్రహ్మమందున లోకముండిన
బ్రహ్మముగ భాసించుచుండును

సూక్ష్మమై, మహనీయమై వ్యా
పించి యున్నది ఒక్క బ్రహ్మమె
సర్వకాలములందు సర్వా
ధారమగునది ఒక్క బ్రహ్మమె

పెరిగి విరుగని దాత్మ తత్త్వము
పుట్టిచావని దాత్మతత్త్వము
నిద్రపోనిది ఆత్మ తత్త్వము
భద్రమైనది ఆత్మ తత్త్వము

మధువుకంటెను గొప్ప అమృతము
మనసుకంటెను గొప్ప ప్రాణము
మతము కంటెను గొప్ప ధర్మము
మనిషి కంటెను గొప్ప దైవము

పండ్ల లోపల రసము నెవ్వడు
భద్రపరిచెనో వాడు దేవుడు
కోర్కెతో ఆ పండ్లు చేగొని
రసము గ్రోలెడి వాడు జీవుడు

వెలుగులకు వెలుగైన దేవుడు
వెలుగు లొసగిన కారణమ్మున
సూర్యచంద్రులు వెలుగుచుందురు
చుక్కలన్నియు వెలుగుచుండును

అన్ని మార్గములొక్కటే నని
అల్లులెప్పుడు పల్కుచుందురు
నిర్గుణోపాసనను మించిన
పూజ లేదని తెలియకుందురు

"బ్రహ్మా సత్యమ్ జగన్ మిథ్యా "
అన్న పలుకుల నరసిచూసిన
బ్రహ్మ సత్యమె కాని, ఎంతయు
మిథ్య కాదీ జగము మాత్రము

లేని ద్రవ్యమునుండి ఉన్నది
పుట్టుకొని రాజాలదండీ !
ఉన్నదియును లోకాన మరి లే
కుండగను పోజాలదండీ !



నిత్యముక్తుండైన ఈశ్వరు
నేదియును బంధింప జాలదు
జీవకోటికి మాత్రమే ఏ
బంధమైనా, సౌఖ్యమైనా

కాలుసేతులు లేక యున్నను
మనసు తనపని చేయునట్లుల
అవయవమ్ములు లేకపోయిన
నేమి ? ఈశుడు సృష్టి చేయును

అంతరంగమె ప్రాణికోటికి
ఆలయమ్మని తెలియవలయును
అంతరాత్మయె సృష్టి చేతన
కారణమ్మని తెలియవలయును

చిత్త వృత్తుల నణచ గలిగిన
స్థితిని మాత్రమె యోగమందురు
యోగమున లభియించు ఆనం
దమును బ్రహ్మానందమందురు

యోగమనగా చిత్తవృత్తుల
నెల్ల బయటికి పంపివేయుట
ఆత్మ దర్శన మనగ ఈశ్వరు
ననుభవములో నుంచగల్గుట

కావ్యముల నే చదివినానని
గర్వపడితిని గాని సత్యము
కొంచెమైనను తెలియకుంటిని
ఇప్పుడిప్పుడె తెలియు చుంటిని

మనకు గల అజ్ఞాన తిమిరము
బాపి జ్ఞానమ్మనెడి సూర్యుని
నిక్కముగ జూపించు వానిని
గురువుగా భావించవలయును

గోపదేవుని కరుణచే నా
లోపమేమో తెలియవచ్చెను
మంత్రమనియెడి అగ్నిచే నా
భ్రమలు పూర్తిగ దగ్ధమాయెను

ఎవ్వడీ జగమందు వందకు
మించి బ్రతికెను ? వేదమార్గము
నందు నడిచెను ? బ్రహ్మనిష్ఠా
పరుడతండే - గోపదేవుడు !

దినమునకునాల్గేసి గంటలు
నాకునొక ఏడాది కాలము
ప్రేమతో వైశేషికాదులు
బోధచేసెను గోపదేవుడు

ఇరువదేండ్లకు ముందు గుండే
రావు గురువై త్రోవ జూపెను
నలుబదేండ్లకు గోపదేవుడు
నమ్మ గలిగిన వెలుగు చూపెను

తెలుగు నేలకు తెలుగు బాసకు
వేదమనియెడి వెలుగు బాటను
గోపదేవులు గాక ఇంకొక
రెవ్వరైనా చూపినారా ?



విశ్వమున వసియించువారలు
మనుజులేననిచెప్పచున్నది
అందరిని శ్రేష్ఠులను జేయగ
వేదమొక్కటి పూనుకొన్నది

వేదములు పఠియింపవలయును
ఉపనిషత్తులు చదువవలయును
అంతకంటెను మించి ఈశుని
తెలియు మార్గము తెలియవలయును

ఒకడు సూర్యుని పూజ సేయును
ఒకడు చంద్రుని పూజసేయును
ఒకడు చుక్కల పూజ సేయును
కాని నే పూజింతు సవితను

ఏది సత్యమొ ఏది నిత్యమొ
ఏది ధర్మమొ ఏది న్యాయమొ
చెప్పగలిగిన గ్రంథ మొక్కటి
కలదు - అదియే వేదమండీ !

వేద ధర్మమె మనకు ఆచర
ణీయమ్మై వర్ధిల్లవలయును
అప్పడే ఈ విశ్వమంతట
శాంతి గంధము పరిఢవిల్లును

నీది గొప్పది నాది గొప్పది
కాదు కాదని చెప్పచుంటిని
ఏది సత్యమొ దానినే ఘం
టాపథమ్ముగ గొప్పదంటిని

క్రీస్తు శకమా మనకు హద్దూ ?
రెండు వేలా మన చరిత్రా ?
వేద ధర్మం మరచి పోతూ
వేదనకు లోనైతిమండీ !

దైవమును ప్రేమించుమన్నా
ధర్మమును రక్షించుమన్నా
వేదమును పఠియించుమన్నా
ప్రణవమును జపియించుమన్నా

వీర్య రక్షణ బ్రహ్మచర్యము
వేద పఠనము బ్రహ్మచర్యము
యోగ సాధన బ్రహ్మచర్యము
ప్రభువు నెరుగుట బ్రహ్మచర్యము

వీర్యమనియెడి కోటలోపల
భద్రముగ తాముందుమేనియు
రోగ రూపములోని శత్రులు
దాడిచేయగ సాహసించరు

సత్య విద్యల గ్రంథమగు వే
దమును తప్పక చదువవలయును
జ్ఞానకర్మోపాసనలచే
ఈశ్వరుని దర్శింపవలయును

కావ్యశాస్త్రవినోదములతో
కాలమేగును మంచివానికి
వ్యసనములతో కలహములతో
కాలమేగును చెడ్డవానికి



వేదవిద్యకు దూరమైతిమి
భేదవిద్యకు దగ్గరైతిమి
శాంతి ఎప్పడు దొరకునో కద !
భ్రాంతి ఎన్నడు తొలగునో కద !

భ్రాంతి మూలకమైన చదువులు
శాంతినీయగ జాలవండీ
అందరికి చెందినది వేదము
అందులో లేదండి భేదము

సత్యమును సాధింపకుండిన
కర్మలన్నియు నిష్ఫలమ్మగు
సత్యమును శోధింపకుండిన
చదువులన్నియు నిష్ఫలమ్మగు

సర్వశక్తికి కేంద్రబిందువు
సత్య విద్యలకెల్ల సింధువు
ఈ జగత్తుకు ముఖ్యబంధువు
ఈశ్వరుండని తెలియకుందువు

అగ్ని వాయువు సూర్యుడంగిరు
డనెడి వారికి మొదటి సారిగ
వేదమును పరమాత్మ చెప్పెను
విశ్వమందలి గుట్టు విప్పెను

అంతకంటెను ముందు ధర్మము
చక్కగా వర్ధిల్లినపుడే
పిదప దానికి దెబ్బయెందుకు
తగిలెనను ప్రశ్నుద్భవించును

మతము మతమని వాదులాడిన
మనకు నేమియు చిక్కదండీ
మతము మానవ కల్పితమ్మగు
ధర్మ మీశ్వర నిర్మితమ్మగు

బ్రహ్మయజ్ఞము - దేవయజ్ఞము
పితృయజ్ఞము - అతిథియజ్ఞము
భూత యజ్ఞము క్రమము దప్పక
ఆచరించిన శుభము కలుగును

ఉదయముననే లేచి ఈశుని
హృదయమున ధ్యానించవలయును
దాని పేరే సంధ్య, దానిని
బ్రహ్మయజ్ఞంబనియు పిలుతురు

బ్రహ్మయజ్ఞానంతరమ్మున
అగ్నిహోత్రము సేయవలయును
దాని పేరే దేవ యజ్ఞము
ప్రతి గృహస్థుని నిత్య కర్మము

బ్రతికి ఉండిన పెద్దలను, వి
ద్వాంసులను సేవించవలయును
దానినే పితృయజ్ఞ మందురు
అది కుమారుల నిత్య కృత్యము

ఆత్మగృహముల కెలమి వచ్చెడి
అతిథులను సేవింప వలయును
దాని పేరే అతిథి యజ్ఞము
ప్రతి గృహస్థుని నిత్య కర్మము



సాయ పడు అశ్వాది జంతువు
లందు కరుణ వహించవలయును
దాని పేరే భూత యజ్ఞము
ప్రతి గృహస్థుని నిత్యకర్మము

కర్మ ఫలముల ననుభవింపక
మంత్రపాదమొ శ్లోకపాదమొ
చదివినను మోక్షమ్ము కలదని
చెప్పబూనుట సాహసమ్మగు

స్వార్థపరుడగు శిష్యునకునొక
స్వార్థపరుడగు గురువు దొరికిన
దుఃఖమునకింకొక్క మార్గము
వెదక వలసిన పనియు నుండదు

అమృతరూపుండైన ఈశుని
గొలుచు మార్గము తెలుపుగురువును
కష్టపడి సాధింపవలయును
మోక్ష పదమును పొందవలయును

దేహమనియెడి గృహము లోపల
స్వయముగా వెలుగొందు జ్యోతిని
నేర్పుతో గుర్తింప వలయును
నిరతమానందింప వలయును

రామచంద్రుడు మంచి రాజై
లోకులను సుఖియింపజేసెను
వాసుదేవుడు యోగివరుడై
గీతనుపదేశమ్ము చేసెను

రాముడైనా కృష్ణుడైనా
మానవులుగ జన్మించినట్లుగ
గ్రంథములె వచియించుచుండగ
కల్లలని భావించుటెట్లుల ?

యుగములను చైతన్య పరచిన
రామకృష్ణుల నెల్ల వేళల
లోకమాదర్శమ్ముగా గొని
నడచుటే నిజమైన పూజగు

కలికి వలెనే దినమునకునొక
స్వామి అవతారమ్ము చేసిన
ఎవరినని పూజింపవలయును ?
ముక్తి నేగతి పొందవలయును ?

దేవదేవుండవతరించడు
చావు పుట్టుక లాశ్రయించడు
దేహములు లేనట్టి వాడే
దేహములలో వెలుగు చుండును

మనుజుడగువాడీ జగమ్మున
యమనియమముల నాచరించిన
శ్రేష్ఠుడై వెలుగొందు చుండును
స్వర్గ సుఖములు పొందుచుండును

కర్మ వాసన లెవని కంటునో
వానిపేరే జీవుడండీ !
కర్మ వాసన లెవని కంటవొ
వానిపేరే దేవుడండీ !



దేహమందున జీవుడుండును
జీవుడుండిన దేహముండును
దేహమకట నశించుచుండును
కాని జీవుండమృత రూపుడు

దేశమునకొక సూర్యుడుండడు
దేశమునకొక చంద్రుడుండడు
దేశమున కొక దైవముండదు
దేశమున కొక ధర్మముండదు

అందరిని ఏకమ్ము చేసెడి
ఆర్ష విద్యలె గొప్ప విద్యలు
ఐకమత్యము గూర్చు విద్యలె
అందరికి కావలయునండీ !

కోతినుండియె మనిషి వచ్చా
డనుచు డార్విన్ వాదులాడెను
కోతి మాంసము తినని యప్పుడు
మనిషికది ఎట్లబ్బెనండీ ?

స్వర్గమందున దేవుడున్నా
డనెడి మాటను విశ్వసించకు
స్వర్గమనునది కాదు లోకము
స్వర్గమనగా దుఃఖ రహితము

రామునికి లక్ష్మణుడు తమ్ముడు
ధర్మజుని కర్ణునుడు తమ్ముడు
అన్నదమ్ములనంగ అట్టులె
ఉన్నచో ఆదర్శమండీ !

కవిత సుందరమైన చాలదు
కావ్యనాయిక అలుక చాలదు
కావ్యమిచ్చెడి సత్య సందే
శమ్ము ముఖ్యము మానవాళికి

శైలిభేదము లెన్నవచ్చును
గుణము దోషము పట్టవచ్చును
శయ్య పాకము చూడవచ్చును
ముఖ్యమైనది చిత్తశుద్ధియె

కవిని నేనని చెప్పవచ్చును
కవితలెన్నో వ్రాయవచ్చును
కాని, కవియను మాటకర్థము
సర్వమును తా నెరుగువాడని

పదవులధిరోహింప వచ్చును
దేశములు పాలింపవచ్చును
సభలలో భాషింప వచ్చును
ముఖ్యమైనది చిత్తశుద్ధియె

శాంతిగోరి అశాంతి రేపెడి
కవితలల్లిన లాభమేమిటి ?
కవితలల్లుట మానివేసిన
కాలమక్కట ఆగిపోవున ?

తల్లిదండ్రులు గురువు లెప్పుడు
యోగ్యులై వర్తించుచుండిన
బాల బాలిక లీ జగమ్మున
మంచి పౌరులు కాక యుందురె ?



డబ్బు కోసము దేశ దేశము
లందు తిరిగిన లాభమేమిటి ?
డబ్బు ఎక్కడనైన శాంతిని
తెచ్చి మనకందించగలదె ?

ఉన్నచోటనె కలదు స్వర్గము
ఉన్నచోటనె కలదు నరకము
ఉన్నచోటనె ఉన్నదానిని
తెలిసి నడిచిన అదియె సంస్కృతి

ధర్మగ్రంథము లెల్ల చదివిన
మంచి అనునది పట్టువడునె ?
నిజముగా నీ గుండె నుండియె
మంచి యనునది నడిచి రావలె

దేహమున అతి సూక్ష్మమగు త
త్త్వమ్ము నాత్మగ చెప్పకొందుము
కాని దానిని తృప్తి పరచగ
దేశములు ధ్వంసమ్ము చేతుము

ఎదుటి వానిని ప్రేమ జూడని
దేమి సంస్కృతి ? ఏమి ధర్మము ?
మనము మనుజుల మన్నమాటను
మరచినడచిన ఏమి లాభము ?

కొత్త వచ్చిన పాత పోవును
నేటి కొత్తే రేపు పాతగు
కొత్త పాతల భేదమెంచక
పంచవలె స్నేహామృతంబును

సృష్టికంటెను ముందుకూడా
సూర్యచంద్రులిలాగె ఉండిరి
అంతరిక్షము, దేవలోకము
భూమికూడ ఇలాగె ఉండెను

ఆప్తవాక్యమె శబ్దమనబడు
శబ్దమనునది ఒక ప్రమాణము
ఈశ్వరునిచే రచిత మగు వే
దమ్ము మనకు స్వతః ప్రమాణము

కాలమును గమనించి యెప్పుడు
కావ్యశైలులు మారుచుండును
చెక్కుచెదరక మూడుకాలము
లందు వెలుగున దొక్కసత్యమె

సత్యమనగా ఉన్నదానిని
ఉన్న విధముగ చెప్పటేయగు
సత్యమనగా బెదరి పోకుము
సత్యమనగా పారి పోకుము

కాలమును గమనించి దుస్తులు
తిండి కూడా మారవచ్చును
మారిపోనిది సత్యమొకటే
మాసిపోనిది ధర్మమొకటే

ప్రకృతి, జీవుడు, పరమపురుషుడు
ముఖ్యముగ ఈ మూడు తత్త్వము
లాది, అంతములేని యట్టివి
అందుకే సత్యమ్ములనబడు



పగలు సూర్యుడు రాత్రి చంద్రుడు
మనకు వెలుగు నొసంగు దేవత
లెంత గొప్ప ప్రయత్న మియ్యది ?
ఈశ్వరుని మెచ్చంగ వలయును

దేహమనియెడి యంత్రమునకును
ప్రాణమే తగు ఇంధనమ్మగు -
ప్రాణమనునది తొలగిపోయిన
జీవుడేమియు సేయ జాలడు

ఆత్మవిద్య నెరుంగు వారికి
అంతయును స్వాధీనమే యగు
ప్రకృతినారాధించు వారిని
దుఃఖమెన్నడు విడిచి పెట్టదు

నిత్యమైనది ఆత్మతత్త్వము
సత్యమైనది బ్రహ్మతత్త్వము
సత్యమును సేవించు వానిని
స్వర్గ మెన్నడు విడిచి పెట్టదు

బాధ్యతలు విడనాడి పోయిన
కాదు అది సంన్యాసమెప్పడు
బాలకుని గని పారి పోయిన
బుద్ధుడెట్లగు జ్ఞానవంతుడు ?

ఎన్నియో కష్టమ్ము లెదురై
వచ్చినను ఆ రామకృష్ణులు
విడిచి సంసారమును, సంన్యా
సమ్ము శిరముల దాల్చినారా ?

కోరికలచే దుఃఖమనునది
కలుగదని చెప్పంగజాలము
కోరికల నెవరదుపుజేసిన
స్వర్గముండును వారి ముంగిట

రసములన్ని సమానమేనని
భరతముని వచియించియుండగ
పండితులు శృంగార రసమును
పట్టుకొని వ్రేలాడు చుండిరి

ఒకరినొక్కరు పీడనకు గురి
చేసికొనుటే హింసయనబడు
హింసలను విడనాడి మనుజులు
హంసలై విహరించ వలయును

మన మనోవాక్కర్మలెప్పుడు
శుద్ధమై ఒకబాటనడుచునో
అప్పడే మన కాత్మతత్త్వము
బోధపడునని తెలియవలయును

పరమ పురుషుని సృష్టిలోగల
అన్నభండారమ్ము గొప్పది
ఒక్కడే తాననుభవించగ
ఏడుకులెందుకు ? పరుగులెందుకు ?

కష్టపడుతూ బ్రతుకునొక్కడు
కష్టపెడుతూ బ్రతుకునొక్కడు
కష్టమెరుగక బ్రతుకునొక్కడు
విడిచి సర్వము బ్రతుకునొక్కడు



జగము లేనిది కాదు సుమ్మీ
దానిమూలము ప్రకృతి యనబడు
ప్రకృతి సూక్ష్మము, జగము స్థూలము,
బ్రహ్మమే సూక్ష్మాతి సూక్ష్మము

ఎన్ని భోగములున్న నేమిటి ?
ప్రణవనామమె నాకు భాగ్యము
ఎన్ని లోకములున్న నేమిటి ?
బ్రహ్మలోకమె నాకు నాకము

విషయ వాంఛలు వీడి నిన్నే
మనసులో ధ్యానమ్ము సేతును
నిరుపమానుడవైన నిన్నే
అనుభవమునకు తెచ్చుకొందును

కీర్తి కొరకై ప్రాకులాడను
విత్తమునకై చింతసేయను
నిన్నెరింగెడి మార్గమునవే
నన్ను నడవగ జేయవయ్యా !

నిగ్రహము సాధించకుండిన
విగ్రహమ్మది ఏమి సేయును ?
మస్తకము పనిచేయకుండిన
పుస్తకమ్మది ఏమి సేయును ?

హితము సేయుట మనుజధర్మము
హతము సేయుట దనుజ కృత్యము
హింసలను విడువంగ వలయును
హంసలై వెలుగొందవలయును

కవిత కాంతా సమ్మితమ్మని
చెప్పమాటలు బూటకమ్ములు
మాతృసమ్మిత మైన కవితలె
మానవాళికి భూషణమ్ములు

కల్పనాత్మకమైన కథలకు
కవులు స్వాగత మొసగుచుండగ
లోకమున సామాన్య ప్రజలను
గూర్చి ఏమని చెప్పవలయును ?

దార్శనిక జ్ఞానమ్ము కొరవడి
మూఢ విశ్వాసములు పైబడి
దిశను జూపని పథము లెగబడి
దేశమును నిర్వీర్యపరిచెను

కదలినట్లుగ తోచుచుండును
కాని అయ్యది కదలకుండును
దూరముగ అనిపించుచుండును
కాని అయ్యది దగ్గరుండును

అగ్ని సంయోగమ్ముచే లో
హముల మలినము బోవునట్లుగ
యోగ సాధన చేత ఇంద్రియ
దోషములు నశియించుచుండును

కనులతో నిను చూడజాలను
వాక్కుతో నిను కొలువజాలను
మనసుతో నిను తెలియజాలను
బాలకుడ దయజూడు దేవా ?



మేము చేసెడి పనులు చూచుచు
మాకు భోగము లిచ్చుచుందువు
పక్షపాతములేని తండ్రివి
ప్రేమమూర్తివి నీవు మాత్రమె

బ్రహ్మఅనగా గొప్పవాడని
విష్ణువనగా వ్యాపకుండని
ఈశ్వరుండన రక్షకుండని
తెలియవలయును విబుధులెల్లరు

మూడు గుణములు ఎవనికుండవో
మూడు దేహములెవనికుండవో
మూడు దుఃఖములెవనికుండవో
వాడు మాత్రమె దేవుడండీ !

ప్రతిది వ్యాపారమ్ముగానే
చూడనేర్చెను నేటి మనుజుడు
ప్రతిది విపరీతమ్ముగానే
వ్రాయనేర్చెను నేటి రచయిత

సత్త్వగుణమూ రజోగుణమూ
తామసమ్మను మూడు గుణములు
త్రాడులై బంధించు జీవుల
జ్ఞాన ఖడ్గము పట్టవయ్యా !

ఏది చేతనమేది జడమో
తెలియకనె పూజించి వ్యర్థము
రాయి రప్పా దైవమైతే
మనిషి మాత్రుండేమి అగునో ?

ఆశ్రయించిన వారికెవ్వం
డమృతమ్మో, ఆశ్రయించని
వారికెవ్వడు మృత్యువగునో
అట్టిదేవుని భక్తి మ్రొక్కెద

ఎట్టి కర్మల కట్టి ఫలముల
ననుభవింపగజేయు వానిని
పుణ్యకర్మలు సేయుమనుజుల
బ్రోచువానిని భక్తి మ్రొక్కెద

గోపదేవుండనెడి ఆచా
ర్యుండు భాగ్యముచేత దొరికెను
కనుకనే చెన్నప్ప కించుక
దార్శనిక జ్ఞానమ్ము కలిగెను

దేవ దేవుడు నా కొసంగిన
దేహమును కాపాడుకొందును
గోపదేవుని పదములంటుచు
దాహమును చల్లార్చుకొందును

